యోధత్వమునకు । వస్తుతత్త్వంబు పరికింపవలయు
జూడ । రామ. ౧౬. చేరువపగయునుదూరపువై
త్రియు గావించనేనియు గార్యహాని । స్వనృప
తో వైర మన్యనృపాలుతో మైత్రి యొనరించనేనిగి
డోదవకున్నె । త్యాగంబునకునాత్మభోగంబునకు
గాని విత్తార్జనంబు గావింపనేల । బాసకుబోనైనబ్రి
తిభాషలాడిన బోలతితో భాషింపబోవదగదు। ఇట్టి
నయ మార్గమెఱుగక యిచ్చవచ్చి । నట్లు చరి
యించువానికి హానిచెందు। నాడికల్లుగలు నిదిని
క్క మరసిచూడ । రామ. ౧౭. సూర్యుండుదశశ
తాంశుప్రభబోదఱిమిన గలుగ వేగుహాలు చీకటు
లుడాగ । ఝంఝూనిలముదాడి సలుపదీపమునకు
గలుగ దేవసియింప గలశ మొకటి । వనిసాళువం
బుగువ్వనుబాఱ దఱిమిన దరుకోటరము లేదె దాని
బ్రోవ । గరుడుండు వెనుదాక గాకోదరముడాగ
గలుగదె వల్మీక బిల మొకండు । బలముగలవాడు
దుర్బలుబాఱదఱుమ, దైవ మొకప్రాపుగల్పింపఁ
దలఁపకున్నె, పోరలు నేప్రొద్దహంకారమున న
రుండు, రా॥ ౧౮. చానతత్త్వముగలమానిసి యనిప

ల్కునసురవర్తనుఁడన్న యర్థమబ్బు, ననిహతవిక్రి
ముడని సన్నుతించిన రణభీరు డన్న యర్థములభిం
చు। నలసమానాకృతి నానస్ఫురదూ్రపి యన్న
యర్థమునది యనుసరించు। ధీరహితుండని తివిరి
వర్ణింప మేధాహీనుడన్న యర్థంబుగలుగు। మను
జలోకాధిపతిని గీర్తనము సేయు। శబ్దముల్ నుతి
దగదని చాటిచెప్ప। వేజెవానినుతింపంగ వేడ్క
కలదె। రా॥ ౧౯. తెరువాట్లుగొట్టి సత్తరువు పెట్టుట
కంటె న్యాయార్జితాన్న మింతైన మేలు। దోటలున
జికిన దొడ్డసావిడికంటె ననఘమై తగుపంచ యి
రుగుమేలు।బహుఘాతకుడు పెట్టుపాయసాన్న ము
కంటె సద్వర్తనుడు పెట్టు జావమేలు। అందఱజెఱ
చి వెయ్యేఱు లిచ్చుటకంటె గష్టార్జితంబొక్క గ
వ్వ మేలు। గర్వపడుదురుతమ పాట్లుగాన లేక। ప్ర
భువులమటంచుమర్మ యోపాయపరులు। వారిబో
గడంగ మాకుత్సవంబు లేదు। రామలిం॥ ౨౦.మా
న్యంబులియ్యసమర్థు డెవ్వడులేడు మాన్యముల్ చె
లుప సామంతులంద। జెండిన యూళ్ళగో డెఱి
.ంప డెవ్వడు పండినయూళ్ళైన్న పొ్రషులంద।

ఱేతడు వేదయబంచు నెఱిగింపడెవ్వడు కలవానిసి
రియెన్న గలరుదొరలు। తనయాలి చీకటితప్పె
న్న డెవ్వడు పరకాంతఱంకెన్న బెద్దలంద। ఱెట్టి
దుష్టులకధికారమిచ్చినట్టి। రాజనసవలెగాక దు
ర్నయుల ననగ। నేమిపనియున్న యదిసత్కవీం
ద్రులకును। రామలిం॥ ౨౧. మలితీరువనిప్రజసూ
పంగవచ్చును వర్షంబుగురియింప వశముగాదు।గ
లవానిచే దండుగలుగొనవచ్చును ధనహీనుబ్రో
వంగ దరముగాదు। పందులబోడిపింప బరువులెత్త
గవచ్చు బులులనుశిక్షింపబోవరాదు। బలముచాల
నివాని భంగింపవచ్చును జేవగల్గినవానిజెనకరాదు
బాపమార్జించుటకు గాక ప్రాభవంబు। ప్రజలకా
పద బాపనోపడుగదయ్య। నీకటాక్షంబొకించుక
లేకయున్న। రామ॥ ౨౨. శ్రీమంతులనునాజ్ఞసే
యడొకండును బరుల నేరములెన్న బరువులెత్తు।
తోటలునఱికెనదోసమెన్న డొకండు నడవిగొట్ట
కుమని యాజ్ఞవెట్టు। పరుపంటముంచినబాడిచెప్ప
డొకండు తప్పగొట్టినవాని దోసమెంచు। నమ్మ
గొల్చినవాని న్యాయమెన్న డొకండు తప్పగొల్చి

నవాని తప్పు జెప్పు। నిట్టిపెద్దల కధికారమిచ్చినట్టి రాజునసవలెగాక దుర్నయులననగ । నేమిపని యున్న యది సత్కరింపుమిలకును। రామ॥ ౨౩. ఆ క్రమింపగవచ్చు నన్యరాష్ట్రంబులు ప్రజలనంద ఱి బాధవఱుపవచ్చు। నన్యాయవిత్తంబులార్జింపగా వచ్చు విభవంబుపెంపుగావింపవచ్చు । మిత్రాధికా రంబుమీటివేయగవచ్చు మహితాపరాధంబు మఱ పవచ్చు। నొకమాటపల్కవేఱొకటిసేయగవచ్చు సంపమున్నతికి గర్వింపవచ్చు । నాయువధికంబు గా గూర్పనలవియగునె। దుర్నయులు మీదెఱుం గక తుళ్ళితుళ్ళి। యిహపరములకు వెలియౌదు రింతెకాక। రామ॥ ౨౪. మేలుచేసినయట్టి మిత్రు ల జెడగొట్టి పెద్దకిరీటంబుబెట్టనేల। తన ప్రాపుగో రు భూధవుల కెగ్గొనరించిగంధసింధురములగట్టనే ల। తనుగొల్చుబంట్లజీతములుతక్కువచేసి ఘోట కంబులుపెక్కు గూర్పనేల। ప్రజలను బడరాసిపా ట్లకగ్గముచేసి యగ్రహారములు సేయంగనేల యధికనిందామలీమసుడైనయట్టి। నృపునికీశుభ వి భవసమృద్ధులెల్ల। శవకృతాలంకృతులుగావె చూ.

సేయ॥ రామ. ౨౫ మౌనంబుదాల్చుట మనవిచ్చ
గింపమి గదిమివేయుట లోభ కారణంబు। దర్శ
నంబియ్యమి తప్పునైపకయునిట్టి వెడమోము వె
ట్టుట ప్రియములేమి। గర్వంబుదెలుపుట కార్యాం
తరాసక్తి సమయంబుగాదంట జరుపునేర్పు। నర
యుదమన్న రంధ్రాన్వేషణాసక్తి యటతీసియం
బు ధౌర్త్యంబు తెరువు। నిట్టిపభుమర్మ యపు జే
ష్ట తెలియగలేక। వెంబడించెడి వాడెపో వెఱ్ఱివాడు।
దానికొడబడ డింగిత జ్ఞానశాలి॥ రామ. ౨౬

పదుగురు కోతివెంబడి సంచరించ వాహకు
ల్లేరె శవంబునకును, గంగిరెద్దుకు లేవెఘనతూర్య
రావముల్ కలిమిగల్గదె వారకామినులకు, పులిగో
వు జంపినకట్టలను బోషింపదె స్థూలకాయములేదె
దున్నలకును। పుష్పిపుంటికి లేదె పుట్టంబుగట్టుట
వేణుధరుండెద్దు వెంటరాడె। న్యాయపద్ధతి నడు
వని యవనిపతికి। నిన్ని చిన్నెలు గలుగని కేమియ
నిన। సంతసమున జూడవలయు నాయయ్య సుఖ
ము। రామ॥ ౨౭. కుమతియె చుట్టంబు కొండెకా
డె। పియుండు కరుణావిహీనుడే కార్యవక్త్రు।

డ్డోరులసంపద కోర్వకుంతుచే ప్రతనిష్ఠ క్రత్వను
ష్ఠానంబు కపటచింత । దుర్బలహారణంబు దోశ్శక్తి
కిఫలంబు కృతమెఱుంగమియె సత్కీర్తిగరిమ । ప్ర
జలగోడాలకింపమియె ప్రాభవచిహ్న మనృత
మాడుటయె వాక్యఫలసిద్ధి । పాపభీరుండు గానిభూ
పాలునకును । నెట్టిఘనుడా శ్రయించిన నేమిగలు
గు । ధార్మికస్థలి యాచ్ఛయు దగ్ధమగును ॥ రా
మ ॥ ౨౫. కొండెంబువానికి గొనచెవి ముత్తియంబ
దయభావమువాని కారయష్టి । యనృతోక్తివానిజి
హ్వారంగనర్తకి ఘాతుకత్వము వానికాతకోల ।
ముష్కరత్వమువాని ముంగొంగుబంగారు కూహ
కత్వమువాని గోడబారు । కూటసాక్ష్యమువానికూ
ర్ఛన్న గద్దెచూపోపమియును వానికొరుగుబిళ్ళ ।
పాపభీరుడుగాని భూపాలకునకు । నెట్టినృపునాశ్ర
యించిన నేమిగలుగు । ధార్మికస్థలియాచ్ఛయు
దగ్ధమగును । రామ ॥ ౨౬. ఆపన్నరక్ష సేయుడు
గాని సజ్జనపీడనంబొనరింప బిడుగుదునుక । నయ
శాస్త్రగరిమ పూనంతుగాని దుర్నయవ్యాపార
ములకు నిదాంతకర్త । కాసైనధనసొమ్ము కర్ఘనే

యడుగాని పరులసొమ్ము హరింపబ్రహ్మవేత్త । కల
నైన సత్యంబు పలుకనోపడుగాని యనృతంబు
లాడ సహస్రముఖుడు । ననుచుదనదు చరిత్రంబు
లవనిజనులు । నింద సేయంగ బ్రతుకు దుర్నీతిప
రుని । వైభవంబౌరయని మెచ్చువాడెమూర్ఖు ।
రా॥ ౩౦. తనతల్లిచోటనే తప్పనటించిన దురితా
త్మునకుగురు ద్రోహమెంత । కొంకొకింతయు లేక
గురున కెగ్గొనరించు కఠినాత్మునకు గృతఘ్నత్వ
మెంత । కృతమెఱుంగనిమహా కిల్బిషాయత్తచిత్తున
కు మిత్రద్రోహ మనగ నెంత । పరమమిత్రులబా
ధ పఱచుదుర్నయునకు బ్రజలనందఱ గష్టపఱు
చు టెంత । యనుచు దనదు చరిత్రంబు లవనిజను
లు । నింద సేయంగ బ్రతుకుదుర్నీతిపరుని । వైభవం
బౌరయని మెచ్చువాడె మూర్ఖు । రామ॥ ౩౧
కడువింత యగుస్థూలకాయంబు గల్గుటచిత్రభూ
షాంబరసిద్ధిగనుట । తూర్యనాదంబులతో జనుదెం
చుటవాలవీజన సమూహాప్తిగనుట । శృంగవేత్రోద్ధ
తి జేరరాకుండుట చూపరు నలుప్రరు జుట్టుకొనుట
స్వనియంత్ర వాక్యంబు వినితలయూచుట మహా

ము ద్రవహించు మత మెఱుగుట । గంగిరెద్దుకుమూ
ర్ఖభూకాంతునకును । భేదమించుక యునుగాని పిం
చదట్టి । ప్రభువు వేడిన సత్క-విపటిమ చెడ దె ।
రామ. ౩౨. తలకొనిపాముశాతలదన్న గా జూచుమి
హిరబింబమునైన మ్రింగ జూచు । దిగ్గంతితోనైన
దీకొనగా జూచు బెబ్బులితోనైన బెనగ జూచు । జల
రాసులైనను జంగజాచగ జూచు నాకసంబును గే
లనంట జూచు । కాలాహినోటను గాలుపెట్టగ జూ
చు యమునితోనైన బోరాడ జూచు । నెదిరి తన్ను
నెఱుంగక యెంతయైన । బరువులెత్తుదురాశ దు
ష్పార్థివుండు । దానికిఫలంబుమూలతో హానిసుమ్ము ।
రామ. ౩౩. సారవేయంబుట్టిచేరు దెంపునుగాని ప
డకుండబట్టునేపాలకుండ । కోతి కొబ్బరికాయగో
న కెక్క- పడద్రోయుగాని లోనిజలంబు లానగల
। ముసలి పెండ్లాడి ముదితయౌవనము వ్యర్థము
సేయుగాకేమి దానగాంచు । కాకిముంగరనోట
గఱచి డొంకలపాలు గావించుగాకేమిగాంచుదా
న । చెడుగు నరుడొరుసంపద జెఱుచుగాని । తన
కు నేమి ఫలింపదు తథ్యమరయ । నిందమూత్రంబు

వానికి నిలుచుజగతి। రామ. ౩౪. చిక్కినపసిమేను చింపజూచునుగాకి బలిసినపసరంబుపైకిబోదు। నక్కపీసుంగుల ద్రొక్కిపీడ్చునుగాని బ్రతికినజంతువుపైకిబోదు। వెలనైనతరుశాఖదొలుచును నుసిపుర్వు చేవమానికి వడిజేరబోదు। ఫుంటిమీదను నీగ గంటుపెట్టునుగాని గట్టినెమ్మేనును గదియబోదు। బీదలనె దుష్ప్రభువుబాధపెట్టుగాని। చేవగలవానిచెంతకు జేరలేడు। సింహముమదేభకుంభముల్ చింపజూచు। రామ॥ ౩౫. పరకాంతబట్టను పాయంబుగల్గదె పరులనిందకుభయపడుటగాక। బలమున్న దుర్బలు బరిభవింపగరాదె పాపంబునకుసుశిక్ష బడుటగాక। కల్మిగల్గిననాడు గర్వింపగారాదె లేమిచే గుండంగ లేమిగాక। యధికారమున్న నాడాగ్రహింప గరాదెయదితిన్న బడదక్క దనుటగాకదుర్నయములుమీ దెఱుంగక దుండగమున।గార్యములెమించ జేసి తత్కార్యఫలము। లనుభవింపుదురాయాయియవసరముల। రామలిం॥ ౩౬. ఒకటిగల్గ బదింటికూహాగావించును గల్గనూటికి ఘాటుపడును। నూఱుగల్గినబదినూళ్లకపేక్షించు వేయిగ

ల్గినబదివేలుగోరు। నయుతంబుగల్గిన నాసించు ల
క్షకు లక్షగల్గిన బదిలక్షలకును। బాటుపెట్టుచునుం
డుబదిలక్ష లబ్బిన గోటికావలెనని కోర్కెసేయు
చాలునని యెంతగల్గిన స్వాంతమునను। సంతసిల్ల
డు గదఘ నాశానిమగ్ను। డాసవిడువక యున్న
సౌఖ్యంబుగలదె। రామ. ౩౭.

ప్రాభవంబున్న బాపభయంబులేకున్న బ్రజ
లనేగతిబాధ పఱుపరాదు। తనలాభమున్న నింద
కుభయంపడకున్న గావింపడే యెంత కార్యమైన।
దయలేకయున్న సంతాన బాహ్యుండైన నొన
రింపరాని కీడొకటికలదె। ముష్కరత్వంబున్న
మూర్ఖసంగతియున్న బాల్పడడే యెంత పనికినైన
గాగలవిపత్తికి భయంబు గదురకున్న। జెల్లునెంతై
న ననియెడియుల్లమున్న। గానిపనికెంతకైన న
గ్గంబుగాడె॥ రామ. ౩౮ జలధివేష్టితమహీ చక్ర
మేలెడురాజు వెంటజేనెడుభూమి గొంచుబోడు।
కొండంతధనరాశి గూర్చుసంపన్నుండు వెంటగా
సొక్కైన గొంచుబోడు। బహుధాన్యరాసులుపా
ర్జించు నాతండు వెంటసోలెడుకొల్చు కొంచుబో
డు

డు। బహుమూల్య వస్త్ర సంపాదకుండగువాఁడు వెంటవేఁ్రలెడుగుడ్డ గొంచుబోఁడు। నిన్నియు నెఱింగి దుర్న్యయుం డెందుకోఁటకు। త్యాగభోగంబు లుడిగి లుబ్ధతవహించు। వానిజన్మంబు జన్మమే వసుధలోన॥ రామ. ౩౯ జంగాలపాలు దేవాంగులవిత్తంబు కాపువిత్తము పంబకానిపాలు। బలిజెలవిత్తంబు పట్టెదాసరిపాలు గొల్లవిత్తముపిచ్చు గుంటిపాలు। వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కలుజువిత్తమురుంబ కానిపాలు। పరదాలకగుసిష్టి కరణాలవిత్తంబు కరిణీశిలధనము తస్కరులపాలు। కవుల కీగలజాతి యొకట్టియులేదు। వితరణము వైశ్యులకు బెండ్లి వేళగలదు। కొంగు పఱుతురు కుపతులాకూటికిపుడు॥ రామ. ౪౦ తమరు దానము సేయదలపోయరే కదా పరుల దానంబు సైపంగలేరు। తమరు సత్యముపల్క దలపోయరే కదా పరుల సత్యంబు సైపంగలేరు। తమరు సజ్జన గోష్ఠి దలపోయరే కదా పరులసద్గోష్ఠి సైపంగలేరు। తమరు సద్వృత్తనిష్ఠదలపోయరే కదా పరులసద్వృత్తము సైపంగలేరు। దుర్న్యయగుణంబులివిపాయదోఁ్రియ

లేరు। వానికిఫలంబు యమసన్ని ధానమందు। దేట
పడుగాక యొరులకు దెలుపవశమె। రామ , ౪౧

నోరువాడైన బూతేరచింపగ జూచుధనము
పెంపైన మత్తత వహించు। కులమున్న సుగుణము
ల్గలుగక వర్తించు వయసున్న బరవధూ వాంఛ
బెనగు। బలమున్న దుర్బలుబరిభ వింపగ జూచుదృ
ఢవిద్యయున్న నాదింపదివురి । త్యాగమించుక
యున్న దనుదా బొగడజూచు మణియమబ్బిన
నోరు మాపజూచు। దుర్న యుడువానిగుణములు
ద్రోయవశమె। దానికిఫలంబుయమసన్ని ధానము
నన। తేటపడుగాక యొరులకుదెలుపదరమె। రా
మ॥ ౪౨. అబ్బినవాని యిల్లాలిగట్టగజూచు దాని
య్యవలసిన దడ్డుజూపు। నలుసైనవాని యిల్లాక్రి
మింపగ జూచు దనకుగీడైన బాదములుపట్టు। న
ణువుగా జూచుగొండంతైె నదనతప్పు గోరంత
యొరుతప్పు కొండసేయు। బంధులకిడ డంచు బ
రుల దూషించునుదనయిల్లుచొచ్చిన దడకవెట్టు।
దుర్న యులదుర్గుణంబులదోియరాదు। దానికిఫ
లంబుయమసన్ని ధానమునన। తేటపడుగాక యొ

రులకు దెలుపవశమె। రామ॥ ౪౩. ఖరశాబమునకు
జక్రనియమనముభంగి సారమేయమున కాజ్యం
బుభంగి। జారచోరాళికి జంద్రోదయము భంగి గొ
శికంబునకు భాస్కరునిభంగి। రోగికిమలయమారు
తకిశోరముభంగి గాలిమేపరికి సుగంధిభంగి। వెలి
చవుల్మఱిగిన వెలదికిబతిభంగిగ వీతదంతునికిశష్కు
లికభంగి। షండునకు లేతప్రాయంపు సకియభంగి।
వాయసమునకు గోకిలస్వనముభంగి। దుష్టునకు స
జ్జనుండు హితుండుగాడు। రామ॥ ౪౪. మలయ
భూధరపవమాన మల్పంబయ్యు జంఝానిలము
కంటెసౌఖ్యకరము। చెలమలోపలి జలంబులుకొ
ద్దియయ్యును జలధితోయముకంటె శర్మదంబు।
నలతియయ్యువిపంచికల మంజులధ్వనిభేరిరవము
కంటె బ్రియకరంబు। కొంచెమయ్యునువర్ణకుసు
మంబు పృథుకర్ణికారంబుకన్న సౌఖ్యప్రదంబు।గు
ణముగలవాని సంపదకొంచెమయ్యు। నర్థిజనుల
కు బ్రియకరం బగుచునుండు। నెంతసిరియున్న
బనియేమి యొడ్డెలకును। రామ॥ ౪౫. కందిరీగల
పట్టుకడగి రేపగ వచ్చుమానిపింపగరాదు దానిపో

టు। చెట్టుతోబెబ్బులి జెనకి రావచ్చును దప్పించు
కొనరాదు దానికాటు। వటుచునశ్వముతోకబట్టి
యీడ్వగవచ్చు దప్పించుకోరాదు దానితన్ను।
కాకచే బొరుగిల్లు గాల్చిరావచ్చును తనయిల్లుగా
పాడ దరముగాదు। దుర్నయులు మీదెఱుంగక
దుండగమున। గార్యతతులెల్ల జేసి తత్కార్యఫల
ము। లనుభవింపుదురాయాయియవసరముల। రా॥
కన్నంబుద్రవ్వి తస్కరుడింటివానికి వాడలేవని
మంత్రవైచిచనునె। తెరవాటుకాడు చింతించునెక
ట్టిన బట్టవుచ్చిన మానభంగమనుచు। వలబడ్డమైక
ముచూల్పహాయించె సంచును విడువంగజాచునే
వేటకాడు। జారుండుపరకాంత శయ్యపై దారిచి
వావిగాదని పలికవదలిచనునె। యాత్మజనుగుత్త
రూకల కమ్మునాత। దరణము నోసంగ జూచునే
యల్లునతడు। నెఱుగరింతియొకాకపరేంగితంబు।
రా॥ ౪౨. గోముఖవ్యాఘ్రంబు కూరలోనిడునాఖ్
కప్పకూతలుగూయు కాలభుజగ। మెరచిలోపలి
గాల మేటిలోపలియూబి పైపూరి గ్రమ్మిన పాడు
నుయ్యి। పైపంట్లు గలిగి లోపల బుచ్చుతెరు శాఖ

గొంగళీ మూలదాకొలుపురాయి। చోరనేమఱిం
చి మంచుకొను పరివాహంబుకునుకు వట్టిన జుట్టు
కొనుదవాగ్ని। దుర్జనుడు వానినమ్మిన దొడరకు
న్నె। హాని యెంతటివానికి నైన జగతి। తలదడిని
బాస జేసిన తగదునమ్మ। రామ॥ ౪౫. మితభాషి
యగువాని మేదకుండని పల్కు జడుడంచు వచి
యించు శాంతపరుని। సంగవిరక్తు బుంస్త్వము లేని
వాడనుహాస లాంఛనునిని రోగార్తుడనును। కరు
ణాసముద్రు విక్రమహీనుడనిపల్కు దానశీలుని
వేష ధారియనును। అవలేపరహితు విద్యాహీను
డనిపల్కు దెలియనివాడను దీర్ఘదర్శి। పనికిమాలిన
వాడను బావభీరు। బుడమినెవ్వరు పొగడిక బొం
ద గలరు। దుర్జనునిచేత నెంతసాధుత్వమున్న। రా
మ॥ ౪౬. కోతికి జలతారు కుళ్లాయి యేటికి విరజా
జిపూదండవిధవ కేల। ముక్కిడికొత్తుకుముత్తెంపున
త్తేల నద్ద మేమిటికి జాత్యంధునకును। మాచకమ్మ
కునేల మౌక్తికహారముల్ క్రూరచిత్తునకు సద్గోష్ఠి
యేల। ఱంకుబోతునకు సద్వ్రతనిష్ఠ యేటికి వావి
యేమిటికి। దుర్వర్తునకు మాటనిలకడ సుంకరి

మోటు కేల। చెవిటివానికి సత్కథాశ్రవణ మేల। స
రసకవితారసంబు ముష్కరుని కేలరా॥ ౫౦. కోతికి
జలతారు కుళ్ళాయిబెట్టిన గోళ్ళవ్రక్కలు చేసికు
ప్ప బెట్టు। కుక్కనందలముతో గూర్చుండ బెట్టిన
నెంగిలాకులునాక నిలకనుఱుకు। దొడ్డపుట్టంబు తో
త్తుకు గట్టనిచ్చిన నదివేడ మఱకల కగ్గపఱుచు।
చెడిపెనుమృదువైన సెజ్జపైజేర్చినడించివెంటల బ
వ్వళించబోవు। హీనజాతికినధికారమిచ్చినేని। హీ
నవర్తనమున జరియించుగాని। పూనుకొనిపెద్దపో
కల బోవగలడె। రామ. ౫౧. కోయిలరొదనేయ
గూయదేకాకంబుదంతిపచ్చినబాటు దుంతరావె ।
పొగడ పూయదొడంగ బూయదే మోదుగ పాల
వండిన వేము పండకున్నె। శివుడు నర్తింప నాడవె
పిశాచంబులు నడువదేరాయంచ నడువబకము। దొ
ర దాల్చురత్నంబు దొడుగ దేభృత్యుండుకొండిక
వ్రాయ దేగురుడు వ్రాయ। దొడ్డవాడు కవిత్వం
బుదొడరిచెప్ప। నల్పుడుకవిత్వమురచింప నభిల
షించు। వానివారింపబనిలేదు వరకవులకు। రామ.
౫౨. ఒడ్డపైకెబాగుచున్నట్టినదివెంపు దూలిపోవు

నుస్వల్ప కాలమునకు। కట్టపైబోరలంగ దట్టుతేటా
కంబునిమిషమాత్రింబైన నిలువలేదు। పెంపుగా బె
రిగిపిప్పిరిసిన విపినంబు దవవహ్ని దరికొల్ప దగ్ధ
మగును। అధికార మత్తత యత్యల్పసమయంబైనన
ది శీఘ్రమునన పెంపడగిపోవు। పాపకర్మంబుగావిం
చు బాధకడలి। యవధిలేదనికృశించుటురవనిజను
లు। తెలియబడదె సుయోధన నాటలచరితము। రా
మ॥ ౫౩. కదలునేయాగ జెకర్లగాడ్పున సురా
ద్రి యింకిపోవునె యనావృష్టిజలధి। తొలగునేత
మము ఖద్యోతజృంభణమున నాజునేచుళుకోదకా
ప్తిదవము। పాగచేబంధింపబడునె మత్తేభంబు క
ట్టచే నిలుచునే గాంగఝరము। గొడ్డండ్లబయలౌ
నెఘోరకాంతారంబుచెదలుగ్రమ్మిన జేవశిఖలమౌ
నె। యెదిరిసత్త్వంబుతనసత్త్వమెఱుగలేక। పలుకు
దురు పెద్దపలుకులు పలువలెల్ల। దొలగద్రోయంగ
వశమౌనెపొడ్డవాని। రామ॥ ౫౪. చోరజారులకు
సుత్సుకతగల్గదటంచు నుదయింపకుండునే యుష్ణ
కరుడు। వెన్కబెట్టునె రాజవీథి జరించుచో గుకర్ల
కహాతకు భద్రకుంజరంబు। తీతువుల్ చెలరేగిదిక్కుల

లరొద సేయ సంచరింపక యున్నె సాహసంబు। నక్కలన్నియుగూడి యొక్కపెట్ట మొఱుంగ దాడిసేయకయున్నె దాడివేకము । కుమతులై నట్టివారికిగొండెకీని। హితవుగాకుండునె నిజత క్కవీశ్వరుండు। వేదకుండునెయరసిపృథ్వీతలేంద్రు రామలింగేశ॥ ౫౫. నెక్కొను విష్ణుసన్నిధి కేగ గ్గలిన నమృతాంబునిధి నోలలాడు సుఖము । నెరి మెచ్చు నింద్రుసన్నిధికేగగల్గిన భవ్యరంభానాట్య పాటవంబు। కలుగునె దాకామగ మనంబుగలిగిన ద్వీపాంతరసువస్తు వీక్షణంబు। సమకూఱుబాదుశా సముఖంబు గల్గిన బృధుతర మానసాభీష్టసిద్ధి। సా ధనంబూహసేయక సాధ్యవస్తు। లాభమొనయగ నాత్మ దలంతు రేల। చాలునది యింగితజ్ఞాన సర ణిగాదు। రామ॥ ౫౬. పసరంబురాగైన బసులగా పరితప్పుపజలుదుర్నయులైన ప్రభువుతప్పు। భా ర్యగయ్యాళైనప్రాణనాథునితప్పుతనయుడుధూ ర్తైన దండ్రితప్పు। అశ్వంబురాగైననారోహకుని తప్పుదంతిమస్తైన మావంతుతప్పు। సైన్యంబుచెడ

రిన సైన్యనాథుని తప్పుకూతురుచెడుగైనమాత త
ప్పు। ఇట్టితప్పులెఱుంగకయిచ్చువచ్చి। నట్లుచరి
యించువారికిహానివచ్చు। దానికొడబడఁ డింగితజ్ఞా
నశాలి। రామ॥ ౫౭. జనులనిందించిన సామ్రాజ్య
మేటికి నక్కఱకొదవని యర్థమేల। జయముసిద్ధిం
చని సాహసంబేటికి సిరిలభించని రాజుసేవయేల
నక్షరం బెఱుగనియధికారమేటికి గోర్కెదీరని స
తికూటమేల। వినయంబుగలుగని వితరణంబేటికి
క్షమపొఱంగిన తపశ్చర్యయేల। కాంతమందిరము
న లేనికలిమియేల। పరులనొప్పించునాశ్రిత భరణ
మేల। నాపదలకడ్డపడని సహాయమేల। రా॥ ౫౮.
అతిసమర్థునకు జేయగరాని పనిలేదు విద్యాధికు
నకెందువింత లేదు। పరుషవక్తకునోటబలుకరానిది
లేదుసత్యసంధునకు బత్త్సంబులేదు। హంతకారికి
యిత డాత డన్నదిలేదు దురితాత్మునకువావివరుస
లేదు।భాగ్యశాలికిలభింపని శోభనములేదు చెడ్డవా
కిరానిచేటులేదు। నేర్చితిరిగినవానికినింపలేదు।క
ష్టమోర్వకయున్న సౌఖ్యంబులేదు। జ్ఞాననిధిగా
కయున్న మోక్షంబులేదు। రా॥ ౫౯. జనసమ్మత

ముగాని పని సేయగూడదు చలముగూడదు కార్య
సాధకునకు । గుట్టు పోనిచ్చిన గట్టుబేదరికంబును
ర్వ్యయపరుడైన దొలగమిసిమి । ఘనతృష్ణ బెన
గినమనుష్యున్న దినశించునోరు చేటుగోరజేటొం
దు దనకు । దుడుకు సేయగరాదు దూరంబుచూ
డక పట్టినపని కడముట్టవలయు । తెలివిచాలనిపని
సేయ గలుగుగీడు । అడుగవచ్చినబగ తెల్పుటను
చితంబు । దుర్జనుల కెడపెట్టుట దొడ్డబుద్ధి । రామ
॥ ౬౦. దైవంబుకృపలేక తనుబ్రోవదెవ్వడు మోహ
మగ్గలమైన మొనయుభయము। ఒంటిమి ఘనమై
న నూరనిల్వగరాదు చింత ఘనంబైన జిక్కు ద
నువు । గర్వంబులావైన గల్గు పరాజయమాశ హె
చ్చినను సౌఖ్యము నశించు । బలముతక్కువయైనబై
బట్టుబరువగు సంచారముడిగిన నటులుపక్షి । స్థలము
విడిచిన మిత్రుడే శత్రుడగును । తిండి మేరదొలం
గిన దెప్పులుముంచు । ముదిసి పెండ్లాడ జూచినము
ప్పుగలుగు । రా. ౬౧ కానున్న పనికి జంకలువై
చుకోరాదు గడచిన వెతదుఃఖపడగరాదు । అగప
డ్డఫలమాన కాసించ గారాదు నరనాథుమున్న నన

మ్మరాదు। కలిసి తెలియరాదు తెలిసి కలియరా
దు గుటిగానిమాట కూర్కొనగ రాదు। తప్పివచ్చిన
చోట దాల్మిసేయగరాదు ముద్దుచెల్లనిచోటఁబురి
యరాదు। ఇందుముఖులకు నధికారమియ్యరా
దు। ఆనుషంగికఫలమల్పమనగరాదు। సాధువర్త
న లివిగదా చర్చ సేయు। రామ॥ ౬౨. ఇల్లుచూచి
నదోచునిల్లాలిశుచిచువృత్తికులవిద్యలగపడుబలుక
పడిన। కొలనిలో దాగదీయజలము లోతేర్పడు జే
నిపంటలు కొయ్యగానెతెల్పు। ప్రజలపొంకముదె
ల్పు బ్రభుధర్మపాలనసుముఖతత్యాగంబు సొంపుదె
ల్పు। భాండశుద్ధతదెల్పు బచననైపుణ్యంబు కూతు
రుపరికటించుమాతగుణము। కవితనేరుపు యతి
గూర్చు కరణిదెల్పు। నిట్టిబహువిధ ధర్మంబు లెఱు
గు నతడె। యింగితజ్ఞానశాలిమహీస్థలమున। రా
మలిం॥ ౬౩. ముంజేతికంకణంబునకద్దమేటికిదంగేటి
జుంటికిదాపయేల। వెలికాటుగ్రమ్ము కూరలరుచు
ల్గొననేలపరులెన్న నేలస్వభార్యగుణము। దొడ్డది
యననేలదొరదాల్చురత్నంబు గోచిపెట్టిన లేమి
దోచ దేల। జవ్వాదియలదిన జంకలెత్తగనేలనిధవ

కుపలసుళ్లు వెదుకనేల । వెఱ్ఱితనమున్న చేష్టలవి
కృతులెల్ల । దేటపడ వేఱె వ్యాఖ్యచ్చి తెలుపనేల । గృ
హిణిలేకున్న గృహసౌఖ్య మహిమ లేల । రా॥ ౬౪.
ఏనుగునిచ్చిన దానకళానిధి కశ్వంబునిచ్చుటేయు
పఘుళంబు । కలితసాలంకృత కన్యాప్రదాతకు వర
దక్షిణయొసంగు వార్తయెంత । యర్థికిమాటవదా
ర్లిచ్చుదాతకు బత్తెంబొసంగుట చేపాటిమేటి । గ్రా
మంబులియ్యంగ గలదానశీలున కిల్లుగట్టించుట
యెంతయింత । నిఖిలభువనావనైక నిర్నిద్రమతికి । నీ
కు ననుబ్రోచు టెంతటిపనిప్రణవస్మృతి । గానసన్మాద
రించు సౌఖ్యమునె నెప్పుడు । రామ॥ ౬౫. పిడికెడుబి
చ్చంబు బెట్టనియత డెట్లు కామితార్థ మొసంగగాం
క్ష సేయు । సందె ముక్కవచింప జాలనియత డె
ట్లుకృత్యనుష్ఠాన సంగతికినోపు । తండ్రికిమృతతి
థి తప్పించు నత డెట్లుపుణ్యవతీర్థయాత్ర సరణివడయు
దప్పికినీళ్లీకదయుముమా డెటువలె నిష్టమృష్టాన్న సం
తుష్టి జేయు । నింగితజ్ఞాన మించుక యెఱుగ లేక ।
యాచకజనంబులెల్ల ఘురాశ చేత । హీనమానసంబుల
యాచింతురింతె కాక । రామ॥ ౬౬.

కలుషమేమిసేయు భక్తమురుచింపని వానిహి
తవాడ నప్రియుండేమిసేయు। ఘనధైర్య నిధికి
శోకంబేమి సేయును గష్టమేమి యొనర్చు గర్తని
రతు। తృష్ణబాధించు నేస్పృహాదొలంగిన వాని సా
మయంబు మితాశి నేమిసేయు। మెలకువగల వాని
నులుకేమి గాపించు నెగ్గుమాన విహీను నేమిసే
యు। మృతికి రోయని నరుమృత్యువేమి సేయు।నీ
మమెడలనివాని గీడేమిసేయు। నింగితజ్ఞాని నొరు
ధార్త్య మేమిసేయు। రా.౬౭.భయపలాయితునకు
బ్రతికుకర్త్రి భయమేల తాను దెంపను ముహూర్తం
బువలెనె। దొంసాని చెఱనోవ దొత్తింటనిలుచు నే
చలువలెక్కనను భైషజ్య మేల మద్యపానము సేయు
మడిపత్రమేటికి మొదలు నోవగ వడిపుట్టు పెట్లు
వదవిహీనునకును బైచెప్పు లేటికి నయన హీనున
కంజనంబువలెనె। బండి గొననేమిటికి లేకిపలుకలె
త్త। బాటిరా మెచ్చనేటికి పౌరుషంబు। ఎత్తవలెనె
యాపోశనం బెంగలికిని। రామ. ౬౮. మనుజుని
దాత్రిపని మత్కుణం బెఱుగునె వాయసం బెట్టునొ
ప్పి। మధుపానమత్తు డుగ్గలిచేవ యెఱుగునే కంతి

వేదసమశకం బెఱుగునె। సేనేమి యెఱుగును బెడ
తలకందురాతి స్పృశనపుర్వ్యథ। చీమయెఱుగ బెట్లు
తనభార్య విరహవేదన జారుడెఱుగునే మృగయు
డెఱుంగునే మృగము బాధ। యెఱుగునే యల్లుడ
త్తవారింటి లేమి। ప్రజల కష్టంబు దుర్నయప్రభు
డెఱుగునె। యెఱుగడింతయు కాకపరేంగితంబు
రామలిం. ౧౯. ప్రజయార్తియెఱుగని ప్రభుప్రదూర
మువ్వె వచ్చెనేమచ్చోట జచ్చెనేమి। అపకీర్తిభాజ
నంబైనట్టి పుత్రుండు పుట్టెనేమి యతండు గిట్టెనే
మి। దర్శనంబియ్యని ధరణీశ్వరుండింట నుండెనే
మి చితాగ్ని నుండెనేమి। బహుజన ద్వేషియౌ ప్ర
భువన్యరాష్ట్రంబు నేలెనే మచ్చోట రాలెనేమి। ప
తికిహిత మాచరింపని పద్మగంధి। చెంతనుపసించెనే
మినశించెనేమి। యిట్టివారల సౌభాగ్య మెంచుకొ
లకు। రామ. ౨౦. కీడేమిచేసె జిక్కెనబక్క కాకికి
ఫణినేమి భేకంబు బాధపఱిచె। పులికేమి యపరా
ధము ఘటించె ధేనుప్ర చిన్మట కెగ్గేమి చేసె జీర।
నేరమేమి యొనర్చె గీరంబు పిల్లికిడుంతకళ్యాం బే
మిహానిగ చేసె। నాచే మేమియొనరె నాగుగా

లికి దీవమెరగలిక డవి యేమెగ్గుచేసె। చీడపురుపుప్రస
క్తగ్గేమిచేసె జేను। ఘలుహ కీడొనరించి నిష్కార
ణముగ। సజ్జన పరంపరలకును జగతియందు। రా
మ. ౭౧. పాత్రసంయోజన ప్రతిభగల్గిన గాని ఘన
మొసంగిన గాడు దానశాలి। కర్తవ్యమును వివే
కముగల్గినను గాని గడ్డంబు నరసిన గాడు పెద్ద।
సముచితాకారంబు సంగ్రహించిన గాని చదువు
మాత్రనె కాడు సద్విజుండు। న్యాయ మార్గంబునన
డువనేర్చిన గాని పదుగురు సేవింప బ్రభువుగాడు।
విమలతరమైన సదసద్వివేకబుద్ధి। శిష్యసమితికిబో
ధచేసినను గాని। దేశికుడు గాడు మంత్రోపదేశ
మాత్ర। రామలిం॥౭౨. అఖిలజగద్ద్వేషి యగుపా
నికడజూడ జాతకసిద్ధాంత చర్చయేల।దర్శనంబి
య్యని ధరణీశ్వరుడు పాపనిర్భికుడనుచు గణింప
నేల।వేడిన మోము వెల్వెలబోవ దొరకీగిపస లేదటం
చునుబలుక నేల వెలిచపుల్లజేగిన విభుడు సన్కాంతగన
డ సేయుసంచునునుడువ నేల పాపకర్మునిపై రాజ్యభా
రమూన్ప। బ్రజల కెగ్గగునని వచింపంగ నేల। నె
ఱుగలింత్రియె కాక పరేంగితంబు। రామ. ౭౩. అ

ల్పనితో నైన నధికునితో నైన జెలిమిగావించినజే టుపచ్చు। గోరంతవాడైన గొండంతవాడైనబగ కసర్పమునృపపాపవర్తి। విద్యాధికుండైనవిత్తాధి కుండైన సజ్ఞాతకులునితో నంటుదగదు। ధనమెం తగల్గిన జనమెంతగల్గిన గర్వమందకయునిక్క కా ర్యాసరణి। యిట్టినయమమార్గమెఱుగక యిచ్చవచ్చి। నట్లుచరియించువానికిహానివచ్చు। నాడికలుగల్గు నిదినిక్కమరసిచూడ। రామ. ౭౪. అప్పుదీఱుప నైన హరియింపనైనసుదలచుమానిసికి బత్రంబువ లదు। వఱగపత్తైనభద్రేభమైనను త్యాగశీలున కు లక్ష్యంబుగాదు। అధికాశ గలవాని కల్పసంతో షికి గణ్యంబుగాకుండుగనకశిఖరి। నాథుండు ర క్తుడైన విరక్తుడైనను దరుణి కేమిటికి సౌందర్యరే ఖ। పరమ హితుడైనమిక్కిలిపగతుడైన। నొక్క తీరున గనిపించుచుండుగాదె। చెఱుప దలచినయ ట్టి దుశ్శీలునకు। రామ. ౭౫. పుణ్యనదీజలంబులుని షిద్ధములౌనె యొకడు తప్పెఱుగక నుమియుమా త్ర। ప్రబల షోడశకలా పరిపూర్ణచంద్రుడొక్క కళంకమున మోదకరుడుగాడె। పెన్నిక్కనూను

రులొక్క పెట్టదీవించుచో నొకమతమ్మైనశుభం బొనరకున్నె। బహుళ శుష్కగ్రాహవృష్టిబలముగల్గి నచోట నొకకూర్కరదృష్టి కీడొనగు రెట్టి। గిరిజను బహుళ కంబునిమిసంబు కొంచెమైన। గొనబుపెంప కయెక్కు నెక్కువగురుస్తు। రాజముమాత్రైననిదియె పద్ధతిదలంప। రామ. ౭౬. లవణాంబుధూళ్యపును హించు నేయంచు మధురోదకములంప్రాప్తిపలన। ఘనవిస్ఫులింగ భీకర దహనజ్వాల రాజునే చు లుకోదకాప్తిపలన। కతక మొక్కటిరాచి కలుపు మాత్రంబున నేటిలోనిజలంబు తేటపడునె। యక్షి హతసర్వాంగుడగుమానవుండజిహ్వా నవాతు జొ నుప సౌఖ్యంబు గనునె। ప్రబలపాతక పూర్ణు డ ల్పంబుసుకృత। మునసుశుద్ధుండు గాకుండునను టనిక్క। మాడుగాకేమియిచ్చకం బన్నృతవాది। రామ. ౭౭. పరవధూటినిభంగ పఱచంగ దలచిన నెన్ని నేరము లైన నెన్నవచ్చు। ప్రభువుగొల్చిన వానిభంగింపదలచిన దుర్మార్గునకు జేటుదొలగకుం డు। నరునకుదనయందు నాలియున్నంతట నెం త దేశంబేగవింత లేదు। తన భ్రోబయోరాజ కత్వంబు

న్న దనునెప్పు డాశ్రయింపగ నెందఱైనగలరు। తనయెడలసాధుభావంబు దవిలియున్న। సాధుజ నులెందఱైనను జగతిగలరు। మంచిదగునారు తనోరు మంచిదైన। రామ. ౭౫. జీలుగుబెండ్లచేజె వ్వులు పెంచగ వచ్చు గూర్ప నేర్చునె రత్నకుండల ములు। తంతువుల్ పెనిచిసూత్రము రచింపగనేర్చు దెచ్చునేహార మౌక్తిక చయంబు। సాధకుల్గొని యాడ సాముసేయగవచ్చు జనికూర్ప గలడె భం డన జయంబు। మహరాసిపాళ్లిల్ల బడుగాక యన యంబు బడయ గలండె సంపత్సమృద్ధి। నీకటాక్ష ప్రసారంబు లేకయున్న। ఫలము జెందంగనేర్చునే పౌరుషంబు। పొరలు గాక యహంకారముసన రుండు। రామ. ౭౬.

దాసికిదండంబు తలగొట్టించుట చెలికానిశిక్ష భాషింప కునికి। భార్యకు దండంబుపడక వేఱుగ నుంట విబుధ దండము గారవింప కునికి। యుప కారికినిదండ ముపకృతి సేయుట తామసిదండం బు త్రాణ్నిసేత। గర్వాంధునకు శిక్ష గణియింపకుండుట ధనవంతునకుశిక్షతప్పగొనుట। యిట్టినయ

పూర్ణ మెఱుఁగక యుచ్చవచ్చి । నట్లుచరియించు
వారికిహానివచ్చు । నాఁడికలుగల్లునిదినిక్క మరసి
చూడ । రామలిం॥ రాం॥ పరునితోరమియించు భా
ర్య గూడుటకంటె మఱిన దాసీసంగమంబు మేలు
పరపీడనము చేయుప్రాభవంబునకంటె నధిక మై
యొప్పుభిక్షాశనంబు । ననికోపాటించు సైన్యాధి
పత్యము కంటె గోపాలకత్వంబుకొంత మేలు । జె
ప్పగలేనిమంత్రిత్వమునకంటె గైపుగాదేసూపకా
రవృత్తి । తనదుచెల్లెలి దోష్ట భూషప్రునకిచ్చి । యత
ని వల్లను సిరిగాంచునంతకంటె । సరస మైతోచు
గంటెదాసరితనంబు । రామలిం॥ రాం॥ నగవుమా
ర్గంబు దంతములు దోపక యుండు మనసు నొవ్వ
క యుండు మాట నేర్పు । వేఁడు నేరుపు చెంత విని
పింపకుండుటదాన సౌష్ఠవము సత్పాత్రుకిడుట । జ
నరంజనముసేత ధనము గూర్చెడునేర్పు మొగ
మోట విడుచుటతగవునేర్పు । అతిరహస్యంబెల్లనా
లోచనమునేర్పు తఱియెఱుంగుట రిపు జెఱుపునే
ర్పు । శక్తిపొగడించు కొన నేర్పు సాహసంబు । హె
చ్చరించుట పనులు సేయించు నేర్పు । పరాసము

న్యులయొచ్చెంబు మాటునేర్పు । రామ॥ ౭౨. ఊ
హింపుచుండు సామోపాయమొక్కటిసమన్వైన
యెడమైత్రి నలుపునతఁడు । నూహింపుచుండుదా
నోపాయ మొక్కటి బలవంతు లోకువ నలుచున
తఁడు॥నూహింపుచుండు భేదోపాయ మొక్కటిచెలు
ప దలంచు నిశ్చింతుఁడతఁడు । నూహింపుచుండుదం
డోపాయ మొక్కటిబలహీనుబోఁగొనిపట్టిబలున
తఁడు । చతురుపాయప్రయోగ విజ్ఞానవిదులు॥ మం
త్రులెలుగంగవలయు నీపుర్తవెల్ల । పరిహరము
నేయ గార్యంబు పరుసఁదప్ప । రామ॥ ౭౩. తనక
మైథున మప్పు చూలధికారంబునాదిసౌఖ్యము క
ష్టమంతమునను । సద్వ్యభతమము నౌషధమునుమి
తభుక్తియాదిగష్టము సౌఖ్యమంతమునను । సఘమ
ర్జ దర్ధి నిందాన్వితుండుపట్టివానిజీవన్మృతులువీరు క్షి
తితలమున । శివలింగ క్షేత్రతటాకవనప్రతిష్ఠలబ్రి
బలువారలు చచ్చిబ్రతుకువారు । తనయుడేమార్తిక
న్య సజ్జనులపనియె॥ యధికమైత్రోచుగడ సజ్జనాప
లికిని। నోసరుచునుగీతపన చేటుకోర్చ ఫలుపుర। రా
మ॥ ౭౪. చెలుకునెప్పకై మూగు టీపల భంగని వ్యా

ఘృణింబునాసించు వరలభంగి। నెంగిలిపుల్లెల కేగు
కాకులభంగి గోప్యాంగముల కెక్కు గోడుసులట్ల
శవముపై గవిసెడు జంబుకంబుల భంగి మలముపై
ముసరు నీగలవిధమున। గోరింటపొదల జైకొనును
ష్ట్రములలీల గాటితో బోరలాడు ఖరములవలె। క
టికి చీకటి దిరుగు ఘూకములరీతి। దిత్రిగదిసెడు
కుక్కల మొత్తములబలె। దుష్టవిభునాశ్రయింతు ర
శిష్టజనులు। రామ॥ ౮౫. శ్రీవైష్ణవుడుగుద్ద చెరువు
లో గడిగిన నదియు సదాచారమనగ దగునె। సో
మయాజిసుతుండుశునకంబుజంపిన నదిన్యాయప
ద్ధతి యనగ దగునె। పరపీడనము రాజవరుడొన
రించిన నదిసాధువర్తనంబనగ దగునె। పౌరాణి
కుండుల్లిపాయ భక్షించిన నదినిషిద్ధంబుగా దనగ
దగునె। ఛాందసుండొక్కరుడు మలోత్సర్జనంబు
సేయబోవుచుశివునినర్చించెనేని। నదియువేదోక్త
పద్ధతియనగదగునె। రామలిం॥ ౮౬. తొంగుండ
మంచంబుదొరక లేదనిచెప్ప బంటునకబ్బనే ప
ట్టుపఱుపు। దొరసాని కోకపట్టె దొరక దంచుద
లంచదొత్తున కబ్బనేతొగరు చీర। యంబటి తో

నికుప్పబ్బ లేదనిపల్కఁ వాంఛ సేయునె పిండివంట
లకును। కంకులకొజ్జలు కాలంబుగోల్పుచ్చ నూచ
బియ్యంబు శిష్యులకు గలదె। యింగిత విచారమాత్ర
లోనించు కేని। నూహా సేయక కలివోయినట్లు
వంక। జూచు చుండుదు రజ్ఞులు క్షోణియందు। రా
మ॥ ౨౧. నివ్వాళిపళ్లెంబు నృపునకుబట్టిన కాంత
యొప్పునె నిషేకంబునకును। మకరధ్వజుని కేళిమ
ననురంజిల జేయునువిద యొప్పునెమల్లయుద్ధమున
కు। దుక్కినాగలిదుంగ జెక్కవడ్రింగికి గలుగు
నే మేడలు గట్టనేర్పు। సాదాపని మెఱుంగుజాడ
గాంచుసొనారి కుందనంబునమెఱుఁ గ్గూర్ప గలడె
పుక్కిటి పురాణములబొద్దు బుచ్చునతఁడు। చెల
గి సద్గ్రంథ కథలెల్ల జెప్పగలడె। యెఱుగ రింతి
యొకాకపరేంగితంబు। రామలిం॥ ౨౨.

కుడుచునప్పుడు చిత్రగుప్తుల కిడునట్టు లీనా
ము వారల కిచ్చునేర్పు। పట్టుచల్లెడు వేళ వడ్రిం
గి కిడునట్టులీనాము వారల కిచ్చు నేర్పు। ధాన్యం
బులొకవేళ దాసర్లకిడునట్టు లీనాము వారల కిచ్చు
నేర్పు। పనలెత్తుచో లేకి పాఱవైచిన మాడ్కి నీనా

ము దారుల కిచ్చునేర్పు । గలిగె నూరూర గ్రా
మాధికారులకును। బ్రభువులును రాష్ట్రులైన కారణము
చచ్చు। వానికానాబ్దికమటన్న వార్తవినము। రా
మ ౪౯. ఇల్వలుం డిష్టాన్న మిడ దెవ్వానినఁబలకభ్ర
యనము లేదె దశాస్యునకును। దుర్యోధనుడు వి
ప్రవర్యుల బ్రోవడే కాలనేమికి జపగరిమ లేదె ।
బాణున కీశ్వర పదభక్తి వెల్లియొ నహుషుండు వైభ
వోన్నతిగనండె। బలిదైత్యునకుదాన పటిమంబు
కొఱతయె వృత్రుండువిక్రమాన్వితుడుగాడె। నా
శమొందరెదుర్వర్తనమునవీరు। హృదయశుద్ధత
లేకుండెనేని నరుల। కెంత సుగుణంబు గలిగిన నెం
దు కొఱకు। రామ. ౫౦. అగ్రహారములు సామా
వశిష్టము లయ్యెమాన్యంబులన్నియు మంటగలిసె
బత్తెంబునకు దొంటి పడికట్లుదప్పెను బుధజనం
ల రాక పోకలుడిగె। వర్షాశనంబులు వఱదపాలై
పోయె మలపతీలసు బ్రజ మాసిపోయె। నశియిం
చి పోయె వంటరుల శిరస్త్రాలు గజ తురంగములు
తా. కట్టువడియె। ధాత్రి క్షాస్థానములకిట్టితల్లోపుట్టు।
గలిన విష్ణుని రాజ్యాధికారి జేసి। యెంత పీడించితివి

సత్క్రియేంద్రకోటి। రామ. ౬౧. ఉభయసంధ్యల
యందునుచ్ఛిష్టసంగ్రహంబునకు సరయునదిగంబర
తలు। గ్రాసాతిరేకం బకారణహింసంబుచరణద్వ
యాల్ప సంక్షాళనంబు। పరవధూ పరవిత్తహరణా
భిలాషయు స్వాంగవాదనము ద్యూతాభిరతియు
మలినాంబరతజానుప్రలమాని నేర్పుటయుపవితేభన
ము దత్త్రాల్పపూజ। పలుమ ఉమియుట యశ్లీలభా
షణంబు। మొదలుగా గలదుర్గుణంబుల నటింప।
శ్రీని వాసున కైనను సిరిపోలంగ। రామలింగేశ॥
౬౨. గూన మూయంగమూకుడుగల్లు గాకెందు గ
లదె తానొకతటాకంబు మూయ। నాజ్ఞ పెట్టగనర్హ
మగు గాకమామిళ్ళ కర్హ మెగుఱ్ఱాళ్ళ కాజ్ఞపె
ట్ట। చెలమలోనీరు డొంకుల జల్లదోడుగాకబ్ధిత్రో
యుముదోడ నలవియగునె। దాసుని శిక్షింప దగు
నేరకుండిన నర్హమె శిక్షింప నతని భార్య। గా
ఢతర మైన యధికారగర్వమునను। గాననేరడు
కోప మూర్ఖజనపాలు। డిదియకర్తవ్యమని యెవ్వ
డెఱుగకుండు। రామ. ౬౩. కాశికి మార్గంబుకడ
వెళ్ళఁజూపిరే మేదిరే తలిదండ్రు లెల్లకాల। మిం

టింట బెట్టించెనే పుణ్యసతిభిక్ష మతిథి బోషించి
రే యనుదినంబు। తరువెక్కఁ గడముట్ట దాపనిర్మిం
చిరే యత్తబోధించెనే యన్ని పనులు। ప్రతి శబ్ద
మునకు విభక్తు లేర్పఱిచిరే కాలువద్రవ్విరే కడలి
ముట్ట। నిట్లుమార్గంబుఁజూపన నేక గతుల। గార్యము
ల దిద్దికొనవలె గానసరులు। జడత వహియింప స
ది లోకసమ్మతంబె। రామ. ౯౪. మావితోఁపులు పం
డి మహిఫలంబులు రాల్చి మొక్కలు దొలిపించి
పెక్కుఁగాఁగ। నవితోఁటలాయెనా యపితెచ్చి గుం
టలోపల నాటి తఱుచుగా పెలుగువెట్టి। కందకం
బులు ద్రవ్వి గట్టిగాఁ గూళ్ళల్లి దుక్కలు దున్నింప
దోఁజలాను। కన్నంతమాత్రనఘనుడుగాఁ డిలదం
డ్రిపోషకుండగువానిబోలలేడు। పోషకుడు రా
జు ప్రజలెల్ల బుత్రసములు। వారికన్యోన్య కలహం
బు వచ్చినపుడు। ప్రభువులకునీతిసమపక్షపాతనిర
తి। రామ. ౯౫. హరునందుభక్తివిద్యలయందు వ్య
సనంబు శక్తిగల్గినచోట సైరణంబు। గురునియం
దును సేవ పరగుణంబుల బ్రీతి కాంక్ష సత్పురుష
సాంగత్యమందు। నాపన్న జనతార్తి హరణంబు

నందున స్వార్జితవిత్తవ్యయాభిలాష। స్వకళత్రపున
యందు సంగమాసక్తిభయంబులోకాపవాదంబువ
లన। సత్పురుషరత్నములకౌర సకలలోక। పూజ
నీయులు వారల బొగడవశమె। పండితోత్తమను
తిపాత్రఫాలనేత్ర। రామలిం॥ ౬౬. తనవృత్తియ
నుచు నమ్మునదేల చనువేళ గాయంబు దనయది
గాకయుండు। తనవిత్తమనుచు నమ్మునదేలచనువే
ళ గొనచని కమ్మిగైకొనకయుండు। తనవారలను
చు నమ్మునదెల చనువేళ రమణియైనను వెంటరా
కయుండు। తన గేహమనుచు నమ్మునదేల చను
వేళ నిమిషమైన శవంబు నిలువకుండు। తనదియే
దియు గాదిది తథ్యమరయ। దాను జేసినధర్మంబు
తనకుదక్కు। పొరలుదానినెఱుంగడు బుద్ధిజడు
డు। రామలిం॥ ౬౭. ధనమున్న నృప వహ్ని తస్క
రభయచింత గునుకు కంటికిరాక కుందుచుండు।
ధనహీనుడగువాడు దారపుత్రాదిన దుర్భరార్తికి
నేమిదోచకుండు। పుత్రవంతుండైన పురుషాగ్రగ
ణ్యుండు తనమృత్యుభీతికి దల్లడిల్లు। సంతానహీను
డౌ జనుడ జన్మంబున గతిలేదటంచునుగలగుచుం

డు । సౌఖ్యదంబని సంసార జలధిమునుగు । జనుని
కెవ్విధమునసైన జర్చ సేయ । నిన్ని యునువ్యర్థ మ
నుబుద్ధియొందులేదు । రా॥ ౯౮. విన్నవించితిలేనివృ
త్తాంతమంటిరా తావకసర్వజ్ఞతకు గొఱంత । దుర్భ
రభవ వార్ధిదాయలేనంటివా యది ఘనమహా హాల
హాలముకంటె । బ్రహ్మవ్రాతకు మాఱు పలుకరా
దన్న మార్కండేయు బ్రోచుట కల్లవార్త । యార్త
శరణ్యుండ వగునట్టినీవునన్ దూరాననొఱుగంగ
ద్రోయ జనదు । నాధకమునికటాక్షేక్షణమ్ము చేత
సుగుణఖనియైన యడిదముసూరయాఖ్యు । మను
పసత్కీర్తి దక్కించి కొనగవచ్చు । రామ॥ ౯౯. భ
య మేల కొండంతపగతుడు నాకున్న మేరుపసం
చిన మేటికలుగ । నాకేల శోకసంతాపంబునను గుం
ద శీతాంశుమౌళి నాచెంత నిలువ । తస్కరభీతికి ప
ల్లడిల్లగనేల ప్రమథులతో శూలపాణినిలువ । నగ్ని
భీతికి నాకునలుకంగ నికనేలగంగాధరుండు నాక
డవసింప । ననుచు నెంతటి కెంతటికలుకులేక । న
మ్మియుంటిని నీప్రాపు శాసనమున । జాగరూకుడ
వై నన్ను సాకవయ్య । రామలింగేశ రామచంద్ర
పురవాస ౧౦౦ అడిదముసూర కవివిరచిత

సమాప్తము

# ప్రకటన

గోదావరిజిల్లా కాకినాడనగరం పత్రివారివీధి పెద్దమసీదుకు పశ్చిమసైడు మంగు వెంకటరంగనాధరావుగారి నె 1862రు యింటియందుండు శ్రీవెంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సునందువిక్రయించబడుగ్రంథములు.

హోల్డింగుటైపువి.

శుకరంభా సంవాదం, సుమతి, నరసింహా, వెంకటాచలపతి, భళిరకరివేల్పు, శతకములు. సీతాకల్యాణం యక్షగానం, దసరాపద్యములు, శ్రీరామవిన్నపం, సీతసమర్త, యజుర్వేద సంధ్య, పుష్పబాణవిలాసం, కపోతవాక్యం, కృష్ణజననం, ఆంజనేయదండకం, గజేంద్రమోక్షం కీర్తన, శ్రీహరివిన్నపములు, దశరత్నములు, నిట్టలప్రకాశంగారికీర్తనలు, తిరుమంత్రం, గోరిటుప్రెమరు సీతాకల్యాణంపాట, అరసవిల్లి సూర్యనారాయణాష్టకం, భర్తృహరి, పెద్దకుచ్చెలకథ,

## ప్రచురపత్రిక.

### పుస్తకవ్యాపారస్థులకు

గోదావరిజిల్లా కాకినాడనగరం పత్రివారివీధి నె 1862ను యింటియందుంచబడిన శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సునందు శిరకముల తెలుగుటైపులతో అనేకరకముల గ్రంథములు ముద్రించి విక్రయించుచున్నారము. గ్రంథములయందు తప్పులుండవు కాగితములు దళసరివి బైండుమంచివి ధరలుచవుక యిదిగాక వర్తకులకు కొన్నికొన్ని సమయములయందు కేవలము కొన్నిరకములే అమ్మకమునకు జరూరైవుండును ఆప్రకారం యేరకంగ్రంథములు యేఅచ్చుతో యెన్ని దినములకు సప్లయిచేయుమంటే అలాగునయి వర్గలము తెపరువర్గాగా ప్లాకు యెప్పుడు ప్రెస్సువారివద్ద నిల్వయుండును.

మంగు వెంకటరంగనాధరావు.